Regd No. N. 40 / M. 3813

వెల ఒక అణా

102891

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౩ వృషనా౹౹ర చైత్ర బ౹౹ ౧౦ (౧౭-౭-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౬౬

★ యుగోస్లావియా సేనలను గ్రీసుకు చేర్చుట ★

★ గ్రీసురంగమందటి జర్మనుఒత్తిడి హెచ్చుట

# బ్రిటిషుమిత్రమండలిసేనలకును జర్మనులకును ఘోరయుద్ధములు

## యుగోస్లావియా సేనలు పోరాటముమానినట్లు వదంతులు

జర్మనులు యుగోస్లావియా, గ్రీసులలో క్రొత్త స్థలములను పట్టుకొనిరి.

బాల్కను ప్రాంతమందు యుగోస్లావియాలోను, గ్రీసులోను ఇప్పుడుజరుగుచున్న యుద్ధమును గురించి ఏప్రిలు ౧౪ వ తేదినుండి ౧౭వ తేదివరకు వచ్చినవార్తలలో రూఢిపడిన ఒకవిషయము ఏమనగా ఒలింపస్ పర్వతమునుండి వాయవ్యదిక్కుగ కొరిట్జా వైపుగా అల్బేనియాకొండలవరకు గ్రీకు సేనలును బ్రిటిషుసామ్రాజ్యసేనలును ప్రాణాలకు తెగించి మహాఘోరముగా, ముందుకుత్రోసికొనివచ్చుచున్న జర్మనుసేనలను పోరాడుచు, ఆపుచున్నవి ఇట్టిప్రతిఘటనవల్లను, బ్రిటిషువారివిమానాలనుండి వేయబడుచున్న బాంబులవల్లను జర్మనుసేనలు అపరిమితముగా నష్టపడుచున్నట్లు బ్రిటిషువారును, గ్రీకువారును ప్రకటించుచున్నారు. ఇంతనష్టము అనుభవించుచున్నను జర్మనుసేనలు వెనకకుతగ్గక ముందుకు పోవుచు క్రొత్త స్థలములను ఆక్రమించినట్లు గ్రీకులుప్రకటించినారు. ఈమూడు నాల్గురోజులలో కనీసము రెండుసార్లైనను గ్రీకుసేనలును బ్రిటిషుసేనలును ముందున్న స్థానాలనుండి వెనుకస్థానాలకు చేర్చబడినవి. యుగోస్లావియాలో జర్మనులతోపోరాడుచున్న సేన ఏప్రిలు ౧౭వ తేదిన, జర్మనులకులొంగిపోవుటకు ఒప్పుకొన్నట్లును, తర్వాతిరోజు ౧౮వ తేది మధ్యాహ్నమునుండి ఆయుధవిసర్జనమును ప్రారంభించినట్లును, జర్మనులును, యుగోస్లావియావారిసేనలు బ్రిటిషువారిచే యుగోస్లావియానుండి సముద్రంమీదుగా గ్రీసులో చేర్చబడుచున్నట్లు బ్రిటిషువారును ప్రకటించినారు. ఈరెండుమాటలును నిజమైనచో యుగోస్లావియానుండి డాల్మేషియాసముద్రతీరానికి చేర్పబడిన యుగోస్లావీయసేనను మాత్రమే బ్రిటిషువారు గ్రీసుకుతొలగించినారని ఊహించుకొనవలసియుండును. జర్మనులప్రకటన నిజమైనదిలేనిది బ్రిటిషువారు చెప్పుటలేదు.

### యుగోస్లావియాలో యుద్ధము

యుగోస్లావియాలో యుగోస్లావీయసేనలు ఏప్రిలు ౧౫వ తేదినాటికి క్రోషియా, స్లావోనియా భాగాల్ మైదానప్రదేశములనువదలి దక్షిణదిశగా బోస్నియా, హెర్జిగోవినా పీఠభూములవైపుపోయి సర్బియాకుచేరుకొనుచుండిరి ౧౫వ తేదినాడు యుగోస్లావీయసేనవిజయవార్త ఒకటివచ్చెను. యుగోస్లావుసేనలు తాముపోగొట్టుకొన్నప్రదేశములను తిరిగిరాబట్టుకొనుటకై జర్మనులతో పోరాడి మొరావాప్రాంతములో కెటూవో, వార్వాలీజా అనుస్థానములను తిరిగిపట్టుకొనగలిగిరి. ౧౬వ తేదినాటి యుగోస్లావియాసేనలు ఒకకట్టుగాయుద్ధముచేయుటమానివేసి శత్రుసేనలనుచిక్కుపరచు పద్ధతిని ప్రారంభించినట్లు వార్తవచ్చెను ౧౭వ తేదినాటికి డాల్మేషియాతీరమునుండి యుగోస్లావీయసేనలు సముద్రంమీదుగా గ్రీసుకుచేర్చబడుచున్నట్లువార్తవచ్చెను. మరియు బెల్గ్రేడుకును, ఏడ్రియాటిక్ సముద్రమునకును మధ్యనుండు సాంజేవో అను పట్టణమును జర్మనులుఆక్రమించినట్లు ఈరోజే ప్రకటించుకొనిరి. జర్మనుసేనలు ఈరోజుకు సర్బియాలోనుండినవి: ౧౮వ తేదినాటికే జర్మనులు యుగోస్లావియాసేనలు తమకులొంగిపోయినట్లుప్రకటించిరి. దీనినిజముముందుగాని దృఢపడదు.

జర్మనులుక్రొత్తగా యుగోస్లావియాయందుఏర్పాటుచేసిన క్రోషియారాజ్యమునకు ప్రభుత్వమును ఏప్రిలు ౧౭వ తేదిన ఏర్పాటుచేసినారు. డాక్టర్ ఆన్టీపావెలిచ్‌గారు అధ్యక్షుడుగను, ప్రధానమంత్రిగను, విదేశాంగమంత్రిగను, జనరల్ కొవాటర్నిక్ గారు ఉపాధ్యక్షుడుగను సేనా, నౌకా, విమానాధిపతిగను, పోలీసుశాఖాధిపతిగను, సంప్రవర్గములోను యుక్తులైనారు క్రోషియాలోని ముసల్మానులనాయకుడగు [illegible] ముఫ్తిగారు కూడాఒకమంత్రిగానియుక్తులైనారు,

ఇప్పుడు ఈభూమిపై పశ్చిమార్థమందలి రేవులలో అనగా అడ్రియాటిక్‌ఖండము ఉండే ప్రాంతమందలిరేవులలో ఉండే యుగోస్లావీయ ఓడలు ౧౫౦౦౦౦ టన్నులపరిమితిగలవియున్నవి. ఆఓడలను బ్రిటనుసహాయానికై యిచ్చెదరని అమెరికా ఖండమందలి యుగోస్లావీయ ప్రభుత్వరాయబారులు ఏప్రిలు౧౮వ తేదిన పత్రికలవిలేఖరులతో చెప్పినారు.

### ప్రక్కలోబల్గేరియాపోటు

యుగోస్లావియా దురదృష్టముబల్గేరియాచర్యవల్లమరింత దుర్భరమైనది బల్గేరియా యుగోస్లావియాలో మైత్రినిత్రెంచివేసికొన్నది. బల్గేరియాసేనలు అలెగ్జాండ్రోపోలిసుకును. స్ట్రూమానదికిని మధ్యనుండు త్రేసు భాగమునుఆక్రమింపనారంభించినవి

### గ్రీసులో యుద్ధము

ఇక గ్రీసులో జర్మనుసేనలకును గ్రీసుసేనలకును జరుగుచున్న యుద్ధముసంగతిని గమనింతము. గతసంచికలో గ్రీసుసేనలపక్షములో బ్రిటిషుసేనలుకూడ పోరాడినట్లు చూచియున్నాము.

ఏప్రిలు ౧౫వ తేదినాడు ఉత్తరగ్రీసులో తూర్పురంగములో బ్రిటిషుసేనలును జర్మనుసేనలుకలిసినవి. అపుడుఉభయపక్షములకును జరిగినయుద్ధములో జయము జర్మనులదే వెనుకకు మరలవలసివచ్చెను అయినను జర్మనుసేనలు క్లిసూరా, కోజాని, సాటిస్టాలవైపు ముందుకు పోవుచునేయుండెను

ఉత్తర అల్బేనియా రంగములో కొరిట్జానుండి గ్రీకు సేనలు ఏప్రిలు ౧౭వ తేదినాటికితొలగించివేయబడినవి ఈతొలగింపునకే మూడురోజులు జరిగెను. ఏప్రిలు ౧౭వ తేదిన ఈసంగతి తెలిసి ఇటాలీయనులు కొరిట్జాలోప్రవేశించిరి.

౧౮వ తేది నాటికి పడమటి మాసిడోనియాలో గ్రీసుసేనలు క్రొత్తస్థలములకుచేరుకొనినవి. బ్రిటిషుసేనలు, గ్రీసుసేనలవెనుకలను జర్మనుసేనలు ఒలింపస్ పర్వతమువద్ద ఛేదించుకొనిపోయినట్లును అందువల్ల లారిస్సామైదానము జర్మనుల ప్రవేశమునకు సులువుగా అందుబాటులోనున్నట్లును జర్మనులు ఒకవదంతిని వ్యాపింపజేసిరిగాని ఆమాట గ్రీసులుగాని, బ్రిటిషువారుగాని అవునని చెప్పలేదు. బ్రిటిషుసామ్రాజ్యసేనలు గ్రీసునుండి వెళ్ళిపోవుచున్నట్లుకూడ ఒకవదంతి ౧౮వ తేదినాటికి వినిపించెను. తర్వాత అదికూడ అబద్ధమేనని తేలినది.

ఏప్రిలు ౧౭వ తేదినాటికి జర్మనుసేనలు పశ్చిమ [illegible] సిడోనియాలోకిచేరెను. ఆదుమైగ్రీసుసేనలు వెనుకస్థానాలకు పోయియుండెను. హాలియక్మోన్ నదీప్రాంతపు ఎగువభాగములోనికి చొచ్చుకొనిపోయిన జర్మనుసేనలు కోజానికి వైపునను గ్రీవెనాప్రాంతమందు పోరాటము చేయుచుండెను. కొరిట్జాకు దక్షిణములో [illegible] గార్జి జర్మనులవశమయ్యెను ౧౭వ తేదిన గ్రీసులో ఒలింపసు పర్వతమునుండి అయోనీయ సముద్రమునందు అల్బేనియాపర్వతముపంక్తివరకు విస్తరించియున్న బ్రిటిషు, గ్రీకు సేనలకును జర్మను సేనలకును చాలఘోరముగ పోరాటముజరిగెను. కొజానినుండి ఒలింపసు పర్వతమునకు పడమట కొద్దిమైళ్ళదూరములోనుండు లారిస్సాకుపోవురోడ్డు నానుకొనియుండు సర్వియాపట్టణముచుట్టును ఆస్ట్రేలీయా సేనలు జర్మనులతో ఘోరముగాపోరాడెను, సర్వియాకు నైఋతిదిశలో ౨౦మైళ్ళదూరమున కలంబకకుపోవుటకు పైకెక్కవలసిరోడ్డువంక తిరుగుచోట అంతకంటెఘోరమైనపోరాటముజరిగెను బ్రిటిషు సేనలఎడమప్రక్కన గ్రీకులుపోరాడిరి. కొజానిప్రాంతమందును, ప్రాతఅల్బేనియా సరిహద్దుప్రాంతమందును జర్మను సేనలు కాఫిల్ కారిక్ కొండ చరియప్రదేశమును పట్టుకొనగలిగినవి. క్లిసూరా రాజమార్గములో జర్మను సేనలు మొదట తరిమివేయబడినను, ఆఖరున క్లిసూరాను పట్టుకొనినవి.

ఏప్రిలు ౧౭వ తేదినాడు మాసిడోనియాలో అలియాక్మోన్ మధ్యప్రాంతమందలి గ్రెవెనా ప్రాంతములోను, ఒలింపస్ ప్రాంతములోను జర్మనులతో పోట్లాడు బ్రిటిషు,గ్రీసు సేనలు నిలువగలిగినవి. సారాండా పొరాజ్‌కనుమను రక్షించుచుండిన బ్రిటిషుసేనలు జర్మను కొన్నిదాడులను. సరితూ పోవులనతీరము వెనుకకు తరుముగొట్టబడెను. ఒలింపస్ పర్వతమునకుదక్షిణమున మరొక కనుమవద్ద ఆస్ట్రేలీయసేనలు రక్షించుచుండగా జర్మనుసేనలు వాటిపైకిపోయినవి. కాని ఏమియుసాధించలేకపోయినవి,

అయినను ఉత్తరగ్రీసులో జర్మనుసేనల ఒత్తిడి రోజురోజుకు హెచ్చుచుండినందువల్ల గ్రీసుసేనలును, బ్రిటిషుసామ్రాజ్యసేనలును క్రమక్రమముగా వెనుకకుపోవుచున్నవి.

### అల్బేనియాలో యుద్ధము

అల్బేనియాలో గ్రీసుసేనలు ఇటాలీయ సేనలదాడులను వెనుకకుతరిమివేయుచు విజయములందుచుండినవి. కాని జర్మనుసేనలును ఇటాలీయసేనలును అల్బేనియాసరిహద్దులో కలిసికొన్నతర్వాత గ్రీసుసేనలు వెనుకకుపోవుటకుకూడ ప్రారంభించినవి. ఉత్తర అల్బేనియాలో కొరిట్జానుండి మొదటగ్రీసుసేనలు ౧౫వ తేదినాటికి తొలగించివేయబడెను. అంతట ఇటాలీయసేనలు కొరిట్జాను ఆక్రమించినవి. ఏప్రిలు ౧౫వ తేదిన చిన్నచిన్న ఇటాలీయసేనలు గ్రీసుసేనలనెదిరించెను. ఆఇటాలీయసేనలు గ్రీసులచేతరిమివేయబడినవి. ౧౬వ తేదినకూడ ఇటాలీయసేనలు గ్రీసుసేనమీదికి వివిధరంగములలోదాకినపుడు వెనుకకుతరిమివేయబడినవి. అల్బేనియానుండి గ్రీసుసేనను సంపూర్ణసామగ్రియుక్తంగా మరలించుకొనిపోవుటకు రక్షణగానుండినట్టి గ్రీసుసేనను జర్మనుసేనలు వెనుకకునెట్టివేయగలిగినవి. అందువల్ల గ్రీసుసేనలుఅనేకములు క్లిసూరానుండియు, యిర్సెక్‌నుండియు తొలగించివేయబడినవి. షిమారాప్రాంతంలోమాత్రము ౧౭వ తేదినకూడ గ్రీసుసేనలుతమపైకివచ్చిన ఇటాలీయసేనలనుచాలనష్టపరచి వెనుకకుతరిమి తమస్థానములలో నిలచియుండినవి.



### గ్రీసు ప్రధాని మరణము

ఆదేవిచిత్రమో ఇటలీదౌర్జన్యమునకు తగిన సమాధానము చెప్పితీరవలసినదేయని నిశ్చయించి గ్రీసును ఇటలీపైకి యుద్ధములోకిదింపిన ప్రధానమంత్రిగారుమరణించి మూడు నెలలు పూర్తిఆయి, కాకముందే క్రొత్తగావచ్చిన ప్రధానమంత్రి కొరిజిసు గారుకూడ ఏప్రిలు ౧౮ వ తేదినాడు మరణించినారు. యుద్ధమధ్యంలో ఇద్దరుప్రధానమంత్రులమరణములు విచారకరములైన విషయములే క్రొత్తవారుఎవరువత్తురోఏమో తెలియదు.

### బాల్కను ప్రాంతంలోవిమానాలదాడులు

ఇపుడుబాల్కను ప్రాంతంలో ఇటాలీయ జర్మనీయసేనలు ఇటాలీయ జర్మనీయుద్ధసామగ్రి ఉండుప్రదేశాలపై బ్రిటిషువిమానాలు, బ్రిటిషు, గ్రీసు యుగోస్లావీయసేనలను, యుద్ధసామగ్రి యుండుచోట్లపై జర్మనువిమానాలును దాడులుచేయుచు బాంబులనువేయుచున్నవి. బల్గేరియా ప్రధాననగరమగు సోఫియాలో జర్మనుసేనలుగలవు. అందువల్ల బ్రిటిషువిమానాలక్కడ ఏప్రిలు ౧౨ వ తేదిరాత్రిబాంబులనువేసినవి గ్రీసులో మోనాస్టిర్ ప్రదేశములు జర్మనుసేనలపై మరఫిరంగులనువేసినవి. యుగోస్లావియాలో దక్షిణసర్బియాలో బ్రిటిషువిమానాలు వెలీసువద్ద వర్దార్ నదిపైనుండేవంతెనపై బాంబులనువేసి జర్మనుసేనను ముందుకురాకుండచేసినట్లు ఏప్రిలు ౧౩ వ తేదినాటివార్తలు తెలుపుచున్నవి. అట్లుఆగిన జర్మనుసేనలపైకి మరికొన్ని బ్రిటిషువిమానాలు వచ్చి బాంబులనువేసినవి. ఏప్రిలు ౬ వ, ౭ వ తేదులలో యుగోస్లావీయవిమానములు ౧౩౫ జర్మనువిమానాలను క్రిందకూల్చినవి. వీలీస్‌వద్దనంతేన ధ్వంసముచేయబడినతరువాత యుగోస్లావీయవిమానములు జర్మనులాక్రమించిన బల్గేరియానాటివిమానాశ్రయములపై బాంబులనువేసినవి. ౨౬ జర్మనువిమానములు చితికిపోయినవి. ఏప్రిలు ౧౫ వ తేదిన బ్రిటిషువిమానాలు గ్రీసులోజర్మనుసేనలబాటలపై బాంబులనువేసినవి.

ఇక జర్మనీవారి విమానాలదాడులనుచూతము బెల్గ్రేడునగరముపై జర్మనువిమానాలు మొదటి పర్యాయము ఒకవందవచ్చినవి. అవివేసినబాంబులచే ౧౨౦౦౦మంది మరణించిరి. ప్రభుత్వకార్యాలయములు ధ్వంసమైనవి, సర్బియా జాతీయవిమానములు అట్టిజర్మనువిమానాలలోనుండి పదునెనిమిదింటిని క్రిందికికూల్చినవి. ఏప్రిలు ౧౩ వ తేదిన జర్మనువిమానాలు పిరయూసుప్రాంతముపై బాంబులువేసినవి ఒకజర్మనువిమానం క్రిందకూల్చబడెను, ముగ్గురుక్రిందనుండినవారలు మరణించిరి, కొద్దిసాస్తినష్టమయ్యెను. జర్మనువిమానాలుకొన్నినష్టమయ్యెను, జర్మనువిమానాలు కొన్నిగ్రామాలపైకిపోయి పొలాలలోపనిచేసేవారలపై మరతుపాకులుప్రేల్చిరట గ్రామాలలోయిండ్లుకొన్ని ధ్వంసమైనవి. పైపొలాలలోకొందరుసలమ్మలు మరణించిరి. కొన్నియిండ్లు ధ్వంసమైనవి. యుగోస్లావియాచుట్టునుండు సముద్రంలో కొన్నిచోట్ల జర్మనుల మందుగనులను జర్మనువిమానాలువేసినవి.

ఏప్రిలు ౧౫ వ తేదిన గ్రీసులోని లారిస్సా పట్టణముపై జర్మనువిమానాలు బాంబులువేయగా [illegible] గ్రీసులక్రిందకూల్చిరి. గ్రీసులోని [illegible] పట్టణముపై జర్మనులు బాంబులువేయుటచే కొందరుచచ్చిరి. కొందరు గాయపడిరి. గ్రీసువారి క్రీటుదీవిపైకి దాడిచేయవచ్చిన ఇటాలీయవిమానమునొకదానిని గ్రీకులు క్రిందికికూల్చిరి.

టర్కీలో జర్మను రాయబారియగు హెర్ వాన్ పేపన్ గారును, రష్యాలో జర్మనురాయబారియగు కౌంటు షూలెన్‌బర్గు గారును బెర్లినుకుపోవుచున్నారు. దీనినిబట్టి రష్యాలో జర్మనీవారు టర్కీలో ఒకరదేశముపైక [illegible] ఒడంబడిక చేసుకొనవచ్చునని [illegible] చెప్పుచున్నారు.

### నియామకములు

హైదరాబాదు దక్కన్, ఏప్రిలు ౨౦

ఖాన్‌సాహెబ్ బుర్హానుద్దీన్‌గారు రైల్వేపోలీసు మొహతెమెంగా నియుక్తులైనారు

షంషుద్దీన్ ఖాద్రీగారు మెదకు తహిసీల్దారుగానియోగింపబడినారు.

మ౹౹ నసీరుద్దీన్‌గారు తాత్కాలికంగా మహబూబునగరు అవ్వల్ తాలూక్దారుగారి మదద్గారుగా నియుక్తులైనారు.

### తంతీలు

మ-ఘు-వ-నిజాం ప్రభువుగారి తల్లిగారిమరణవార్తవిని హి-బి-వైస్రాయిబహద్దరుగారు తమకుకలిగిన వ్యసనమునువ్యక్తపరచుచు తంతివార్తనంపిరి. అందులకు శ్రీవారు కృతజ్ఞతను తెలిపిరి. ఆదేవిధముగా నీలగిరిలో అప్పటిరెసిడెంటుగారును సర్ ఫ్రాన్సిస్ వైలీ వైస్రాయ రాజకీయ సమాలోచకులను తంతివార్తలనంపిరి

మద్రాసులో ముస్లింలీగుమహాసభలో యీవార్తతెలిసినవెంటనే ఒకసానుభూతిసభ పరామర్శతీర్మానముకావించి మ-ఘు-వ ప్రభువుగారికంపిరి, మద్రాసునుండి నవాబుబహద్దరుయార్జంగు బహద్దరుగారును ఒకతంతినంపినారు హైదరాబాదునగరములో ఆంధ్రయువతీమండలివారు పురపాలకసంఘమువారు, రెడ్డిహాస్టలువారు తదితరసంస్థలవారును సానుభూతిసభలనుచేసి తీర్మానాలంపినారు.

## మధురవాణీవిలాస కార్యకర్త వంశావళి

గొట్టిముక్కల చంద్రమౌళీశ్వర శర్మగారు

చింతలపల్లివారివంశము, వేదవేదాంగమంత్ర తంత్రకవిత్వ కళా ప్రపూర్ణులుద్భవిల్లిన వంశము. ఈవంశమువారు నాకుసమీపబంధువులు. అట్టి వారిచరిత్ర నాకుదెలిసినంత యీవ్యాసమున వ్రాయ బూనినాడ.

వంశము

తారీఖు ౭-౩-౧౯౪౦- శ్రీవిక్రమ, మార్గశిర-శు, ౧౦, ఇందువారము. నాటి గోలకొండ పత్రికలో శ్రీమాడభూషి అవధాని, పండితరామానుజస్వామి ఆయుర్వేదాచార్యులవారు సంక్షిప్తముగా యీకవినిగురించి వ్రాసిరి, కానివారు గోత్రము నివాసము, కాలము మొదలగువిషయములు సందేహముగానున్నట్లు తమవ్యాసమునలిఖించిరి. నాకుదెలిసినంతవరకు పైయంశముల వ్రాయుచున్నాను. కవిగోత్రము. వశిష్టసగోత్రము, ఆశ్వలాయనసూత్రము చింతలపల్లివంశస్థుడు మధురవాణీవిలాసమే గాక "రామస్తవరాజను" అను పేరుగల గ్రంధమునురచించినట్లు వంశస్థులు నుడువుచున్నారు, కవినివాసముమహబూబునగర్ జిల్లా, నాగర్‌కర్నూలు తాలూకాలో చేరిన "వట్టెము" అనుగ్రామము వీరివంశస్థులు ఈగ్రామమునయిప్పటికిని గలరు.

వీరివంశావళి యీక్రిందివిధముగా వెలయుచున్నది. మూలపురుషుడునంద్యాలలో కృష్ణదేవరాయలవారి (కళాపూర్ణోదయకృతిభర్త) కాలములోనుండెను. కవిత్వమువెప్పి మెప్పువడసి మాన్యములసంపాదించెను వీరిపేరువీరరాఘవకవి, మధురవాణి విలాసకర్త పితామహులు. వీరుఆరుమంది సోదరులుగవీరరాఘవకవి, ౨వెంకటయజ్వ ౩భాస్కరయజ్వ ౪పుల్లయ్యశాస్త్రి. ౫వెంకటాద్రయ్య,౬కోదండరామయ్య. నావీరునాదేశములలో రాజులబొగడ్తలగాంచి, వారివారిరాజ్యములలో పండితులుగా, కవులుగా వెలసిరి. ఎట్లుచీలికలైన వంశస్థులు, ఒక్కొక్కగ్రామకర్తలుగా వెలసిరి అట్లునివసించినవారి వివరములను పేర్కొనుచున్నాను.

వంశపుచీలికలు

శ్రీచక్కల్లాపుర రాజధానియందు చింతలపల్లి భాస్కరశాస్త్రివర్యులు వీరుసాప్రపితామహులశిష్యులు ఋగ్వేదజ్యోతిష స్మృతి, శాస్త్ర, కావ్య. నాటకాలంకారాది విద్యలందుప్రఖ్యాతివడసి, శ్రీరాజావారివల్లమాన్యములు, వేయినూటపదారు రూప్యములు, జోడుశాల్వలు పడసినవారు. ముప్పది వత్సరముల నాడు గతించిరి.

(౨) కొల్లాపురరాజధానిలోచేరినది. చెక్కముగ్రామములో చింతలపల్లి మాణిక్యావధానులుగారు వీరుకావ్యనాటకాలంకారాది సాహిత్యవిద్యలందు ప్రఖ్యాతివడసినవారు వీరికినాబావమరదినిదత్తతనిచ్చినారు.

(౩) నందికొట్కూరు తాలూకాలో చేరిన పారుమంచాలగ్రామములోచింతలపల్లి భాస్కరజోస్యులు. వెంకటరంగజోస్యులు అనువారుఇద్దఱన్నదమ్ములు పెద్దవారు నందికొట్కూరు కాపురముగా మార్చుకొనియున్నారు వీరుశ్రౌతము, జ్యోతిషము మొదలగువాటియందుగొప్ప ప్రఖ్యాతిగలవారు, ఆంధ్రభాషలోతిక్కనార్యుని భీష్మద్రోణ పర్వములుపురాణము చెప్పెడివారు రెండవవారు స్మార్తము, జ్యోతిషములందుప్రజ్ఞావంతులు మొదటివారికి ముగ్గురుకొమారులు, రెండవవారికి ఐదుగురుకొమార్లు వీరునుకడుసమర్థులే

(౪) వీరునాగరకర్నూల్ తాలూకా వట్టెముగ్రామంలోనున్నారు వీరుముగ్గురిలో పెద్దవారు వ్యాకరణకావ్యపారంగతులు. రెండవవారు ఆంధ్రసాహిత్యమునందు ప్రతిభగలవారు ౩వవారు స్మార్తాది బ్రాహ్మణ కార్యములు నిర్వర్తించుచున్నారు.

కర్నూల్ జిల్లా. కోయిలకుంట్లతాలూకా శౌకుగ్రామములో ఒకరున్నారు, వీరుచింతలపల్లిరామావధానులుగారు, వీరుజ్యోతిష వైద్య, స్మార్తాదివిద్యలందారి తేరినవారు.

ఒకవారు నెల్లూరుజిల్లా వెంకటగిరిరాజధానిలోచేరిన చేర్లదిన్నెగ్రామవాసులగు చింతపల్లినృసింహశాస్త్రివర్యులు వీరుబళ్ళారి మునిసిపల్ హైస్కూల్ సంస్కృతాంధ్రోపాధ్యాయపదవిలో పంద్రెండువత్సరములుండి, శ్రీవెంకటగిరి రాజావారియనుమతినిర్ధిష్టబాణుని కాదంబరినిమహాయాత్ర్కోను సారముగా శృంగారకాదంబరిగా రచించిరి. వీరుమేధాదక్షిణా మూర్తిమంత్రోపాసకులు,

ఇట్లుపండితకవివరేణ్యులుగా వెలసిన యీచింతలపల్లివారిలో, మూలపురుషులలో, నాల్గవవారు పుల్లయ్యశ్రౌతి,యనునాతడుకీ॥శే॥ కాశీకాలమందు బడిపంతులుగాపనిచేసిరి. బడిలోపంతులవారనివిద్యార్థులుపిలిచెడివారు ఇక గ్రామజను లెల్లరు పుల్లయ్యశ్రౌతులవారని. పుల్లాపంతులవారనిపిలుచుచుండిరి, నాటినుం

ఈచింతలపల్లివారు కొందరు పుల్లాపంతులవారని వ్యవహారముగా వెలసెను. వీరలలోగూడా పండితులు కవులుగానెందరోగలరు. కొందరిని పేర్కొందును.

పండితులు, కవులు

[౧] పుల్లాపంతుల పెద్దసంజీవయ్యగారు, వీరునామాతామహితంద్రులు.వీరుగద్వాల,వనపర్తి, గోపాలపేట, కొల్లాపురాది సమస్థానములందు జ్యోతిషము, సాహిత్యాదిపరీక్షలనిచ్చి పండితుల పొగడ్తగాంచినవారు. సంవత్సరవార్షికముభూములు, ఇప్పటికిని వీరిసంతతికి జరుగుచున్నవి. వీరు [౧] వ్యాకరణబాలబోధను, (౨) జ్యోతిషవివరణమును వ్రాసినట్లు వీరికొమారులకడ నేను కొన్నాళ్ళక్రిందట చూచినాను. వీరిస్థిరనివాసమునంద్యాల సమీపమున బోతుకుంట్ల గ్రామము-వీరికి నలుగురు కొమార్లు, ఇద్దరు కొమార్తెలు, ఒకరు నామాతామహి, రెండవవారు నాచిన్నాయనగారైన గొట్టిముక్కల రంగనాధశాస్త్రి వర్యులధర్మపత్ని-కొమారులు ముగ్గురు రాజకీయాదియుద్యోగములందున్నారు-ఒకరు దేవియుపాసనా ధురంధరులై నంద్యాల నివాసముగా నిల్పించుకొనియున్నారు, చిన్న సంజీవయ్యగారు జిల్లామేజస్ట్రేటు పదవియందుడిరి. వారికిద్దరు కొమారులు పెద్దవారు తండ్రిపదవిలోనున్నారు. రెండవవారు శాస్త్రాదివిద్యలందు ప్రతిభగలవారై స్వగ్రామములోనున్నారు- ఇదిపుల్లాపంతులవారి ప్రథమచరిత్రభాగము-

రెండవ వంశము కర్నూల్‌జిల్లా, మార్కాపురము తాలూకా బోదముపాడు, అగ్రహారంలోఒకకుటుంబము వెలయుచున్నది- వీరునలువురన్నదమ్ములు, నలువురుకవులే, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, దైవముదిన్నె మొదలగు కవితాసభలకువచ్చి అష్టావధానములు గ్రంథకవిత్వములుచెప్పిమెప్పువడసి సంభావనముపొంది ప్రతివత్సరముకెళ్లుచున్నారు- ఇట్లువీరు నలువురు (౧) సూర్యనారాయణకవి, (౨) సుబ్రహ్మణ్యకవి, (౩) విశ్వనాథకవి, [౪] వేంకటరామకవి యని వీరిపేరులు. నేనువీరినిచూచినాను- ఈవిధముగాచింతలపల్లివారి వంశము నాటినుండి నేటివరకు విద్వత్పాండితకవిత్వసంపదగలవంశమై విలసిల్లెను-

చింతలపల్లి వారికి, గంగాపురమువారు బాంధవ్యముగలవారు, చింతలపల్లివారు చిరిగెల్లివారికి దౌహిత్రతజెందినవారు-నేనుగూడా చిరిగెల్లివారి మనుమడనే- ఈ చిరిగెల్లిగ్రామము నంద్యాలకు సమీపమునగల ...-వీరు కొల్లాపురరాజధానిపురవాసులును, రాజ పౌరోహితులును, పండితవంశము గాబరగినవారును [గంగాపురము వారిచరిత్రకోరినచో వివరములనుపంపుకొందును] వీరును అనుగ్రామములలో కాపురస్థులుగా వెలయుచున్నారు-

చింతలపల్లి వీరరాఘవకవిని గంగాపుర దేశపాండ్యాలుపొగడినట్లు శ్రీమదాచార్యులవారు వ్రాసిరి-కాని గంగాపురము, దేశపాండ్యాస్థలము గాదు. హిందూరాజులకాలములో శ్రీచెన్నకేశవస్వామికి గ్రామమును దానముజేసియుండిరి- కొన్నాళ్ళసహింహూరాజ్యధ్వంసమైనతర్వాత మహమ్మదీయులపాలనలోనుండి ఒకమహమ్మదీయ రాజుజాగీరుగా నేటికిని పాలింపబడుచున్నది- ఆచార్యులవారి యభిప్రాయమున్నట్లే గంగాపురముకవిబంధువులే పొగడినట్లుభావించుట యుక్తము-ఇట్లే ఏనుగులక్ష్మణకవి కూచిమంచితిమ్మకవిని 'తేనియతేటలు మా కూచిమంచి తిమ్మయమాటల్,'అని స్తుతిజేయుటేదా, ఇచటగూడా యిట్లే భావించుకోవలయును-

### గ్రంథప్రకటన యత్నము

మధురవాణీవిలాసమును నేను ప్రకటింపనిచ్చగించినాడ-ప్రతిలభింపక చాలాకాలమునుండి ప్రయత్నమునేయుచున్నాను- శ్రీమదాచార్యులవారు, నాకుగ్రంథమును మండపిమండి, తాముసవరించిన పాఠభేదాదివివరణగ్రంథమును నాకుదయచేయించినచో శతావధానులకీర్తిని పాండిత్యమును లోకమునకు వెల్లడింపగలవాడను- నాబాంధవులు గ్రంథముద్రణద్రవ్యము నొసంగునట్లు నాకు వాగ్దత్తము నేసినారు- ఈ వ్యాసాభిప్రాయమును శ్రీమాడ- రామానుజస్వామి ఆచార్యులవారు జూచి తప్పులున్న సవరించి నాప్రార్థననంగీకరించవలయునని యింతటితో విరమించుచున్నాను.

నాఅడ్రసు క్రింద తెలుపబడుచున్నది:—

మారానుమగాల, వ్యాపర్లపోస్టు రాయమా రుజిల్లా-

## పురపాలకకార్మికులసభ

## న॥ మెహిదీ నవాజుజంగుగారి బోధ

### అపూర్వమైన ఉత్సాహము

౧౯ఖుర్దాదు శుక్రవారమునాడు ప్రొద్దున౧, గంటలకు హైద్రాబాదునగరంలోని బాగెఅమాలోని జంపుకేసుల భవనములో (టౌనుహాలువద్ద) సుమారు౨౫౦౦ పురపాలక సంఘకార్మికులయొక్క సభజరిగెను. ఈ భీజ శ్రమజీవులను నవాబ్ మెహిదీనవాజుజంగుబహద్దరుగారు సమావేశపరచియుండిరి. సఫాయి డాక్టర్లు,ఉద్యోగులు గుమాస్తాలు, అమీనులు,జవానులు, విరివిగావచ్చియుండిరి. స్త్రీలును పురుషులును కార్మికవర్గమువారు సుమారు ౨౫౦౦మందివరకు వచ్చియుండిరి శ్రీమతి సరోజనీనాయుడుగారును, శ్రీమతి పద్మజానాయుడుగారును విచ్చేసియుండిరి. దూరశ్రవణయంత్రము అమర్చబడియుండెను. మొదట పురపాలకసంఘము నాజింగారగు న॥ మెహిదీనవాజుజంగు బహద్దరుగారు ఇటీవల శ్రీ. మ. ఘ. వ. ప్రభువుగారి మాతగారి మరణము సంభవించినందున ఆమెయొక్క ఆత్మశాంతికైప్రార్థనలుచేయుటకు రాజకుటుంబమువారికి సభవారిసానుభూతిప్రకటించుటకును ఒకతీర్మానము ప్రవేశపెట్టిరి. శ్రోతలు ఇతరులుఅందరునునిలిచి తీర్మానమునకు ఆమోదించిరి, నాజింగారు తీర్మానమును తెనుగులోనే చదివిరి. తెనుగులోనే దానిని వివరించి చెప్పిరి. దానికే సురవరము ప్రతాపరెడ్డిగారు వివరించి తెనుగులోచెప్పిరి. అటుతర్వాత నాజింగారు తెనుగులోనే తాముకార్మికులకు కలిగించినసౌకర్యములను గురించి వారికిట్లు తెలిపిరి. "మూడేండ్లక్రిందట వీధులూడ్చునట్టి సఫాయినౌకరుల జీతములలో ప్రతివ్యక్తి జీతములను ఒక్కొక్కరూపాయి వంతున నెలజీతము హెచ్చుచేయించి అట్టిరూపాయిలో ప్రతినెలకు ప్రతివ్యక్తి ౪ అణాలు భీమా కిచ్చునట్లును ౪అణాలుస్టోరు సామానులకు ఇచ్చునట్లును ఏర్పాటుచేయబడెను, వానిఫలితముగాభీమా చేసినబీదలకుచాలా లాభము కలిగినది. ఎన్ని ఏండ్లుపనిచేసినను ఈబీదలునౌకరి వదలుకొనిననాడు రొప్పుటివలెనే దరిద్రులుగా ఉందురు. విపత్తువచ్చి చనిపోయినవారిపిల్లలకుదిక్కుండదు. ఈరెండేండ్లలో ౫-౭మందిబీదలీలు చనిపోయిరి. వారు ౭-రూపాయిలనుండి ౧౦౫రూపాయిలవరకు భీమాఖిస్తుల కట్టియుండిరి. వారి వారసులకిప్పుడు ౩౦నుండి ౭౦రూపాయిలవరకు లాభించుచున్నది, ఇప్పుడూపైకొన్ని వారి వారసులకిచ్చుచున్నారు. స్టోరుద్వారా ౯౦౦౦రూపాయిల ఖరీదుగల చీరలు,రవికెలు, ధోవతులు అగ్గువగా నౌకర్లకు పంచిపెట్టబడినవి, ఇంకనూ నౌకరులకు భోజనసామానులు అగ్గువగాఇప్పించు ఏర్పాట్లుచేయదలచినాము, ఈనౌకర్లుచాలమంది అప్పులపాలైనారు. అప్పులవారివడ్డీలుచాలా భరింపరానివైయున్నవి, కాని నౌకరులు మాకుఅధికారమియ్యవంతవరకు వాటిని తీర్పచేయజాలము, నౌకరులయిండ్లలో పారిశుధ్యమేర్పాటు చేసినారు, వారిగుడిసెలకు సహాయము చేసినాము. వారిపిల్లల చదువులకు ఏర్పాటుచేసినాము, వారికి ఉచితవైద్యము ఇప్పించుచున్నాము.

తర్వాత శ్రీమతి సరోజనీనాయుడుగారు చనిపోయిన వారివారసులకు భీమా మొత్తమును పంచిపెట్టిరి. ౭రూపాయిలు భీమాకట్టినవానిభార్యకు ౩౦రూపాయిలు దొరికెను. ఇట్టిమొత్తాలను ౫-౭ వారు అందిపొందిరి, వారుపైకొన్ని ఎందుకొని ఆనందబాష్పాలను ప్రత్యక్షముగావదలిరి. నాజింగారి కాళ్లపైబడి కృతజ్ఞతను తెలుపుకొనిరి. ఆ దృశ్యము ఎటువంటికఠినులనైనను కరిగించునట్టిదిగా ఉండెను. సభ౧౧గంటలకు ముగిసెను.

## బాదేపల్లి భారతము

మార్కెటు గుమాస్తా బర్తర్ఫు

(విలేఖరి)

జడిచర్లస్టేషను, ౧౫-౪-౪౧

మామార్కెటు మహత్మిమ్ కచేరీలో పనిచేయుచుండిన మహమ్మద్ మౌలానా యుసుఫ్ మహమ్మదుహుస్సేన్ అనువతడు యిచ్చటనొక సాహుకారువద్ద భోజన పదార్థములు అరువుతీసుకొని పట్టిపై దస్కతు చేసియిచ్చియుండెను. సరస్వతి ప్రసన్నమే గాని లక్ష్మీప్రసన్నం కానందున సాహుకారుగారు డబ్బు అడుగగా ఒకరోజున తనంతవాన్ని అడుగునా యను అహంభావముతో పైబడికొట్టెను దానివిషయమై కొర్ట్యాయిబడెగాని ప్రయోజనముకలుగలేదు. బుజువుకాలేదని కేసుకొట్టివేయబడెను. ఈమధ్య మాతాలూక్దారు యిచ్చటికిరాగా సాహుకారుచిట్ఠీ తీసుకొనివెళ్ళి తనకుజరిగిన అన్యాయం మనవిచేసుకొనెను అసమయమున మార్కెటునాజంసాహెబుగారుకూడ తాలూక్దారువారివెంట నుండిరి. అధికారులు మౌలానాగారినిపిలిపించి అడుగగా దస్కతుతనదికాదని బొంకెను. దానిపై దఫ్తరుపుస్తకములలోనున్న ఇతనికిసంతకములతో చిఠిపైనున్న సంతకమును పోల్చిచూచి దస్కతు మౌలానాగారిదేయని నిశ్చయించి యిట్టివారలు ప్రభుత్వోద్యోగమునకుపనికిరారని బర్తర్ఫు చేసిరి.

జమేదారుగారు భజనలు బందుచేయించుట

పగలంతయుపనిచేసి విసిగియుండురుగాన ఉత్సాహముగాయుండుటకై యువకులు కొందరు రాత్రిపూటలందు కొంతసేపు భజనలుచేయుచుండిరి—ఒకరోజున మా జమేదారుగారుదయచేసి హుకుంలేనిది భజన చేయకూడదని బెదరించుటచే యువకులుభయపడిరి. ఈవిషయమై జిల్లాపోలీసు మొహత్మిముగారివద్దకు జానపాటి సత్యనారాయణగారువెళ్ళిమనవిచేయగా చిన్నచిన్న ఉద్యోగులు తెలియక ఆటంకపర్చిన భయపడనక్కరలేదనియు ఆవరణలో భజన చేసుకొనవచ్చుననియు మొహత్మింగారు సెలవిచ్చిరి. అనవసరజోక్యం కల్గించుకొనకుండ అమీన్ సాహెబుగారికి తెల్పుకొనవలసినదనికూడ మొహత్మింగారుచెప్పిరి. కాని మా జమేదారుగారు సంతృప్తిపడక యిజాజతుకావలెనని పట్టుబట్టిరి. దానిపైభజనసమాజమువారు తహశీలుదారుగారివద్ద దరఖాస్తు పెట్టగా, తహశీలుదారుగారు తాలూక్దారుగారికి దరఖాస్తు పంపిరి. భజనచేసుకొనుటకు యిజాజతు అవసరమేలేదనియు నిరాక్షేపణగా చేసుకొనవచ్చుననియు తాలూక్దారుగారు హుకుంయిచ్చిరి.

## శ్రీ ఆంజనేయాంధ్ర గ్రంథాలయ పునరుద్ధరణ

మాగ్రంథాలయస్థాపన ఏ దుర్ముహూర్తమున జరిగెనోగాని, ఎన్నియోసార్లు భూశయనము చేయబడియు, నశింపక జీవచ్ఛవముగతె యేమనుటకు దుగులేక అల్లాడుచున్నది. ఈమధ్య ఆంధ్రమహాసభాధ్యక్షులవారు ఈప్రాంతమునకు దౌరావచ్చినప్పుడు జిల్లా సంఘనిధినుండి ధనసహాయము చేయించిరి—ఇప్పుడీగ్రంథాలయము శ్రీ పెరుమాళ్ళ ఖండేరావుగారింట నొక భాగములో నున్నది. ఇకమున పోలీసువారప్పుడే మా ఖండేరావుగారిని గ్రంథాలయమునకు యిజాజతుతీసుకొంటివాయని యడుగ మొదలిడిరని తెలిసినది.

### విషాదము

హుజూరునగరం ఖుర్దాదు౧౧

మ.రా.శ్రీ కొఖ్ఖారు వెంకటరావుగారు జమీందారుగుండేపూడిఖుర్దాదు౧౦వతేది ఫసలీ తేదీన సాయంకాలయందు మధ్యాహ్నము దివంగతులైరని తెల్పుటకు చింతిల్లుచున్నాము. వీరువయోవృద్ధులయ్యుసంస్కారప్రియులు, యువకోత్సాహముగలవారు. మధిరతాలూకాయందు సంపన్నులగుజమీందారులు వుదారస్వభావులు, సుప్రసిద్ధకవులచే కొన్నిగ్రంథములనువ్రాయించి ప్రచురింపించి ఆంధ్రభాషకు దేశమునకు సేవజేసిరి.

ఇట్లు
టి. శేషగిరిరావు

### విషాదము

నిజామాబాదు(దక్కను) ఏప్రిలు౧౫

దిగ౫-౪-౪౧ మంగళవారంసాయంత్రం ౫గంటలకు నిజామాబాదు దయానంద అనాథాశ్రమముకొరకున ఆర్యసమాజమందిరములో శ్రీ పరమభక్తుడైన సేట్ జామ్మద్ లాల్ జీగారు తీర్థయాత్రలుసేవించుచు అయోధ్యలో స్వర్గస్థులైనందున విషాదము తెల్పుటకై శ్రీమాన్ పప్పుకిషన్ రావు వకీలుగారిఅధ్యక్షతలో శోకసభ జరిగెను,

గోభక్తధర్మాభిమానులైన నిజామాబాదునివాసి సేట్ జామ్మద్ లాల్ గారు స్వర్గస్తులైనందుకు దుఃఖమును వెల్లడించుచు, వారిఆత్మకు శాంతినిచ్చుటకును, వీరికుటుంబమునకు ధైర్యము నిచ్చుటకును పరమాత్మునిప్రార్థించు తీర్మానము ఆమోదించబడెను.

డి. వి. స్వామి
అధిష్ఠాత

## బీదలకుఉచితచికిత్స

(స్వ.వి)

మహబూబునగరం, ఏప్రిలు ౧౩

నిజాంఆయుర్వేద వైద్యశాల శ్రీఅయ్యప్పగారు తెరచుకొని కొన్ని అవుషధములు పెట్టియుండెను. అతనిమరణానంతరము కొన్నిమాసములకుజ మూయబడెను. తిరుగ మొన్నకొన్నిరోజులక్రిందట శ్రీ శివునయ్య హకీంగారుకొన్ని అవుషధములు బీదలసౌకర్యార్థమై పెట్టి వైద్యాలయమును తెరచినారు పల్లెటూరివాండ్లుకూడ సంతరోజులలో వచ్చి అవుషధములుకొనిపోవుచున్నారు. వీరియౌషధములు చాలతక్కువగాయున్నవి. ఈసంఘ సభ్యులగుహకీములందరు అతనికితోడ్పడి అవుషధాలయములో మందులు సప్లయిచేసిన వీరెక్కువగా బీదలసేవచేయగలరని నాయూహ. ఇప్పటికిబీదలకు వుచితముగా నవుషధములనిచ్చుచున్నారు, పల్లెటూరివారుకూడారావచ్చును. మంచి అవకాశము.

## రాత్రిపాఠశాలపైచర్య

నారాయణపేట: ఖుర్దాదు ౬.

ఉగాదిసంవత్సరమునాడు వైదికరాత్రిపాఠశాలస్థాపించబడెను. ఆర్యసమాజస్థాపనదినవిషయమై మరియు పాఠశాలస్థాపించబడినఉద్దేశము అను తెల్పుటకొరకై నరసింగుఅవధూతిమఠములో ఒకధార్మికసభ హైందవధర్మోన్నతికై జరుపబడెను. పోలీసుఅమీన్ గారు ౪-౭-౫౦ ఫసలీనాడుఆర్యసమాజమంత్రియగు రాజమల్లయ్యనుపిలిపించి నీవుయేపరిఅజ్ఞవలనసభజరిపితివి అనిఅడిగిరి. అందులకుమంత్రిగారు చౌదివారిలోసభచేస్తేఆజ్ఞపొందుటఆవసరముక్రొత్తనియమావళుల ననుసరించి సభజరిపినాము ఈసభకేవలము మతసంబంధమైనదనిచెప్పిరి. తదుపరిమంత్రిగారికిపేట సర్కారిమొహరులేని ఒకనోటీసుజారీచేసినారు.

బనాంరాజమల్లయ్యమంత్రి నారాయణపేట ౨౪-౬-౫౦ ఫస్లీనాడు పాఠశాలనిమిత్తమై సభజరిపినారు ఇట్టిసభకై యెట్టిఆజ్ఞ అవ్వల్ తాలుకుదారుగారిచేపొందితిరాలేదా పొందినట్లయితే ఈనోటీసుప్రత్యుత్తరంఇచ్చేది.

ఇట్లు
యస్. సాంబమూర్తి సిద్ధాంతరత్నం,
ప్రచారకుడు,
నారాయణపేట

## కేశంపేటతిరుణాల

(స్వ.వి]

కేశంపేట, ఏప్రిల్ ౧౧

ఈతిరుణాల పూర్వముకన్న చాలావైభవంగాజరిగెను వేలకొలదిజనమువచ్చియుండెను. నేటిరాత్రిరథోత్సవము రాత్రి ౧౦॥ ౧౦ ౪౦ కుజరుపబడెను. శ్రీరాణిగారు యథాప్రకారము మేనాలోకూర్చొని రథముచుట్టు ప్రదక్షిణగావించిరి. మంగళహారతినొసంగిరి శ్రీరాణిగారుమేనాముందు భోగం అధికారులుఅడుగులకు మడుగులొత్తుచుండ మహాజనము వెంబడించ రథముగుంజబడెను. ఒక మైదానములో వేశ్యలగానప్రదర్శన గావింపబడెను, కాని వారందరుఉర్దూలోనే తమపాటను పాడినవినిపించిరి మందులుకాల్చబడెను, పూర్వపురీతిగ నేమరల ఆఫీసర్లుముందు తిర్యాతశ్రీ రాణిగారిమేనా,సర్కారురథము మహాజనముతో యథాస్థానమునువచ్చెను. పగటికి భోలామందియాత్రికులకు బత్తాలనిచ్చిరి, భోజనసత్రముల నేర్పాటుచేసిరికాని తగినవ్యావసేజాకాలేదు. ఇదివెలకులకుజరుగుజాతర కావున అంగడులు చాలతక్కువపడియుండెను, నాగరుకర్నూలు తహశీలుదారుతదితరఆఫీసర్లకు జల్సాచేయబడెను- భోగమువారిఆటపాటలుకూడ జరుపబడెను,

# నిజాంరాష్ట్రపు ఎనిమిదవ ఆంధ్రమహాసభ

## చిలుకూరు (హుజూరునగరం తాలూకా, నల్లగొండ జిల్లా) లో జరుగును

నిజాంరాష్ట్రపు ౮ వ ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘమువారీ క్రిందిప్రకటనచేసినారు.

ఈ ఎనిమిదవఆంధ్రమహాసభ నల్లగొండజిల్లా పత్తుమన హుజూరునగరం తాలూకాలోచేరిన చిలుకూరు గ్రామములో ౧౭-౧౮-౧౯ తేదిలందు అనగా ౯. ౪ సరియగు ౨౨-౨౩-౨౪ మే ౧౯౪౧ న సంవత్సరపైశాఖ బ౹౧-౨-౧౩-౧౪ జరుగును

జిల్లాసంఘములయభిప్రాయము ననుసరించి శ్రీ రావినారాయణరెడ్డిగారు ఈమహాసభకు అధ్యక్షులుగాఎన్నుకొనబడినారు. పైతేదులలోను హిళామహాసభకూడజరుగును. ఈమహాసభకు ప్రభుత్వముఅనుమతిలభించినది. రాష్ట్రాభివృద్ధికి అనుగుణ్యములగు విషయములతోబాటు తెలంగాణాకు సంబంధించినసమస్యలపైన తీర్మానములు చేయబడును ప్రభుత్వపరిశ్రమల శాఖవారిద్వారా చేతిపరిశ్రమలను గురించిన ఎగ్జిబిషను ప్రదర్శనమును ఏర్పాటుచేయబడును. ఆరోగ్యపశువైద్యములనుగూర్చి ప్రభుత్వశాఖలపక్షమున ఉపన్యాసము ఏర్పాటుచేయబడును.

గతమహాసభలో జరిగినవ్యవస్థప్రకారము మంటపనిర్మాణము, ప్రతినిధులకు బసలు, నీటివసతులు (నల్లాలు) దూరశ్రవణయంత్రములు (లౌడ్‌స్పీకరు), విద్యుద్దీపములు (లైటులు) మున్నగుఏర్పాటులకు అధమము ౧౦-౧౨ వేల రూపాయలవ్యయము అగునని అంచనావేయబడినది గతమహాసభలకు ఇట్లేఅవసరముకలిగినది, ఈ మహాసభను నల్లగొండజిల్లావారుఆహ్వానించినందున ఈఖర్చులను ఈజిల్లావారే భరింపవలసియుండును ఆహ్వానసంఘసభ్యత్వ రుసుము ఒకరూపాయిగా నిర్ణయించబడినది

ఎక్కువవ్యవధిలేనందున ఈఖర్చులకు వలయు ద్రవ్యముసమకూర్చుటకు సామాన్యప్రజలయొద్దకి వెళ్లి వసూలుచేయుటకవకాశము లేదు, ద్రవ్యవంతులు, మామిడాడ్లు, వర్తకులు, పెద్దపెద్దపట్టేదార్ల ఔదార్యముపైననే ఈమహాసభయొక్క విజయము ఆధారపడియున్నది. దేశాభిమానులు తమ విశాలహృదయముతో ఎక్కువవిరాళములు ప్రసాదించి తమదేశాభిమానము వ్యక్తపరచవలసియున్నది. విరాళములు, లేక ఆహ్వానసంఘసభ్యత్వ రుసుము చెల్లించినవారికి ఆహ్వానసంఘముపక్షమువరసీదు యివ్వబడును.

ఎనిమిదవఆంధ్రమహాసభ చిలుకూరుగ్రామములో సమావేశపరచుటకు తీర్మానింపబడి ఆహ్వానసంఘమేర్పడినతర్వాత, ప్రభుత్వమువారు ఎట్టి నిర్బంధములులేకుండానిర్ణీతతేదులగు ౧౭-౧౮-౧౯ మే,, సభాసమావేశమునకు అనుమతినొసంగిరి. ఇందుకుఆహ్వానసంఘసభ్యులు ప్రభుత్వమునకు కృతజ్ఞులు, నల్లగొండజిల్లాప్రముఖులు ప్రకటింపబడిన కరపత్రములజదివి మాకుసాహాయభూతులై సంకల్పసిద్ధిలో తోడ్పడెదరని యాశించుచున్నాము.

ప్రభుత్వానుమతి లభించినతర్వాత సభాప్రయత్నములతీవ్రముగా జరుగుచున్నవి. ఆహ్వానసంఘసభ్యులు విరాళములప్రోగుచేయుటకై సర్వవిధప్రయత్నములు గావించుచున్నారు, ప్రతితాలూకాలో ఒకఉపాధ్యక్షులు కార్యదర్శులు తదితర ఉద్యమాభిమానుల సహాయసంపత్తిలో పర్యటన మొనర్చుచు సభోద్దేశ్యముల వెల్లడించుచు జిల్లాప్రముఖులయందు దభిమానము పురికొల్పుచు విరాళములప్రోగుచేయుటయందు మగ్నులైయున్నారు. అప్పటికప్పుడే సుమారు రెండువేల రూప్యములకొక్కము విరాళములు చేకూరినవి. వాగ్దానములసంఖ్యమూడువేలకు మించిపోయినది జిల్లానాయకులు ప్రప్రథమమునడబ్బుకైచెందిన విరాళదూరమైనది, అవసరమున్నధనము సమకూడగలదను ధైర్యముకలిగినది.

సభాసమావేశమునకై కావలసినఏర్పాట్లకై ఆహ్వానసంఘము తగురీతిగయత్నించుచున్నది. నీటిగొట్టములు, విద్యుద్దీపములు, దూరశ్రవణయంత్రములుమున్నగు ఏర్పాట్లుకడునిపుణతతో కావింపబడుచున్నవి, గతమహాసభసందర్భమున సంభవించిన కొన్నిఅనివార్యఇక్కట్లు,మరలకలుగకుండుటకై కట్టుదిట్టములు కావింపబడుచున్నవి. నగరం, సికంద్రాబాదుస్థలములయందలివ్యాపారులతోడనేగాక బెజవాడమున్నగుపట్టణములందలియానమున్న కంపెనీవారలతోసంప్రదించిఅన్ని సౌకర్యములుకలుగచేయుటకై యత్నింపబడుచున్నవి,

### మహిళామహాసభ

మహాసభతోపాటు మహిళామహాసభకూడా యథాప్రకారంజరుగును. జిల్లాముఖ్యస్థానమందు ఆహ్వానసంఘమేర్పడి క్రిందిసభ్యురాండ్రు ఎన్నుకొనబడినారు.

౧ శ్రీమతి, పులిజాలకమలాబాయిగారు (ఆహ్వానసంఘాధ్యక్షురాలు,) ౨ యం. పద్మాబాయిగారు (ఉపాధ్యక్షురాలు ) 3 శ్రీమతి బి. అండాళమ్మగారు (కార్యదర్శిని ) ౪ ఆర్. అండాళమ్మగారు (సహాయకార్యదర్శిని.) ౫ యం అహల్యాదేవిగారు (కోశాధ్యక్షురాలు ) ౬ పులిజాలఇందిరాబాయి, ౭ పులిజాలజానకీబాయి, ౮ పి. బుచ్చిరెడ్డిగారిసతీమణి. ౯ లక్ష్మీకాంతరావుగారి సతీమణి ౧౦ శ్రీ వెంకటరామారావుగారి సతీమణిగారు ఇతరసభ్యురాండ్రుగనున్నారు. మహిళామహాసభ అధ్యక్షపదవికై శ్రీమతిరంగమ్మ ఓబులరెడ్డిగారు ఎన్నుకొనబడినారు.

### కొన్నిసందేహములనివారణ

కొందరుమహాశయులు స్థలనిర్ణయమువిషయమై కొన్నిసందేహములు, కలుగబోవుఅసౌకర్యముల సూచించియున్నారు. ఎవరో "పులిజాలవారు" గోలకొండపత్రికలో ఒకప్రకటనగూడ గావించినారు, తదితరులుకూడాఉత్తరముద్వారాఇట్టిసూచనలనే చేయుచు వేరవోలు మున్నగుఇతరప్రదేశములు సభలకొరకై అనుకూలమనిఅభిప్రాయమిచ్చినారు కానిఇట్టిసంశయముల నవసరములనిఇందుమూలకముగా ప్రకటించుచున్నారము స్థలనిర్ణయమునకుముందు అన్నివిషయముల, సాధకబాధకముల విచారించిరే చిలుకూరుగ్రామం నిర్ణయింపబడినది, నీటికైఅచ్చటకొరతలేదు, మంచిమంచిపెద్దబావులుఉండియున్నవి. నీరుపుష్కలముగాలభించును. ఇంతియేకాక నీటివసతికొరకై తగినన్నినీటిగొట్టములు పెట్టబడును. విద్యాలయందును వంటశాలలందును తదితర యావసరప్రదేశములందును నీటిపంపులద్వారా నీరుసప్లయిచేయబడును గతమహాసభలయనుభవముచే, అప్పుడుకలిగినచిన్నచిన్న అసౌకర్యములు ఈసంవత్సరము కలుగకుండునటుల ఆహ్వానసంఘము అన్నివిధముల ప్రయత్నించుచున్నది మహాసభనిర్ణయతేదులందు జయప్రదముగాజరుగును ఉద్యమాభిమానులందరు మహాసభలోఅసంఖ్యాకజనము పాల్గొనుప్రబోధము ప్రజలలోకలుగచేయప్రార్థితులు

ఇట్లు

బి. వేంకటరాం నరసింహారావు

కె. వేంకటరామారావు, బి.ఏ.ఎల్ ఎల్.బి

ఆహ్వానసంఘ ప్రధానకార్యదర్శులు

---

అమాయకులగు బాలురను కష్టములనుండి రక్షించుటకు తల్లుల ప్రథమకర్తవ్యము

పిల్లల ఆరోగ్యబలములకు

ఇక్‌ఫార్టోక్‌ను జ్ఞప్తియందుంచుకొనుడు

దేశమునందు సుప్రసిద్ధమైన ప్రయోజనకారి

సీసా 1కి 16 అణాలు ప్రతిచోట దొరకును.

## ఇక్‌ఫాక్టోక్

మాన్యూఫ్యాక్చరింగ్ కంపెనీ, హైద్రాబాదు-దక్కన్

Khn&Sons

---

## మీకు ఆకలిలేదా?

### జీర్ణకోశవ్యాధులకు పెట్టిన పేరుగల జీర్ణామృత లవణమును వాడుడు

ఈలవణము జీర్ణకోశముపై పనిచేయు ఉత్తమ ఔషధములచే తయారుచేయబడినది దీనిసేవనచే ఏకారణముచేతనైనను అరోచకమువల్ల అన్నహితువుతప్పి కృశించిపోయినవారిపాలిటి పెన్నిధి. మూడు మోతాదులు పుచ్చుకొనగానే వాతమును కొట్టివేసి ఆకలిని కలిగించును. అజీర్ణ అతిసారములు వాంతులు, భ్రమ, కడుపుబ్బరము, శూల, అగ్నిమాంద్యము, ప్లీహోదరము, ఆమ్ల పిత్తము, కలరా, కామిలా మొదలగు జీర్ణకోశ సంబంధమగు వ్యాధులనన్నిటిని శమింపజేయును. మలబద్ధకమును తొలగించి సుఖవిరేచనము కలుగజేయును. శరీరమును దృఢపరచును. ఏవయసువారైనను నిర్భయముగా వాడవచ్చును.

మాభృంగామలకమువలెఒకపర్యాయమువాడండి.

### ఆయుర్వేద కెమికల్ వర్క్సు

షరీఫ్‌నగర్ —— స్టేషన్ పాద్‌నగరు N. S. R.

---

# హిందూస్థాన్ మ్యూచుయల్

ఇ॥ కం॥ లిమిటెడ్, మచిలీపట్నం

అధ్యక్షులు డా. భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు

నిజాంరాష్ట్రమంతటను సమర్థతగలఏజంట్లు కావలెను.

పూర్తి వివరములకు దిగువ చిరునామాకు వ్రాయుడు.

చీఫ్ ఆర్గనైజరు

కె. సత్యమూర్తి

సికింద్రాబాదు

# ముఖ్య గమనిక

ఈకంపెనీ పట్టాదారులందరు తమకిస్తు రూపాయీలను ఇకమొదలు హైదాబాదు ఇంపీరియల్ బ్యాంకుకుగాని లేక, ఖమ్మం ఆంధ్రబ్యాంకుకు గాని దాఖలు చేయగోరెదము.

సికింద్రాబాదు సెంట్రలుబ్యాంకులో మాఖాతా నిలిపివేసినాముగాన ఇకముందు సికింద్రాబాదు సెంట్రలుబ్యాంకుకు పంపవలదు.

జనరల్ మేనేజరు

మచిలీపట్నం

---

## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ యిండియా లిమిటెడ్.

1946 సంవత్సరపు 3 o/o డిఫెన్సు బాండ్లు కొనువారికై

సెంట్రల్ బ్యాంకువారి ప్రత్యేకస్కీము.

(1) సెంట్రల్ బ్యాంకు ఆఫ్ ఇండియా లిమిటెడ్‌వారు 1946 సంవత్సరపు 3o/o డిఫెన్సు బాండ్లు ప్రకటింపబడినరేటుప్రకారము యిత్తురు.

(2) బాండ్లకొరకు దరఖాస్తుచేయువారు తాముబాండ్లుకోరిన మొత్తములో ప్రతిశతి ౧౦ ను ముందుగా చెల్లింపవలయును రు. 100 లకు అంతకుపైనగాని దరఖాస్తులు తీసికొనబడును.

(3) తరువాత బాండ్లమొత్తము యీక్రిందివిధముగా చెల్లింపవలయును. మొదటి మూడు నెలలవరకు ప్రతినెల 5 గాని అంతకెక్కువగాని చెల్లింపవలయును, మిగతమొత్తము దరఖాస్తుచేసిన తేదినుండి రెండుసంవత్సరములలోగా కొన్ని వాయిదాలక్రింద పూరనుచెల్లింపవలయును.

(4) బాండు విలువనుపూర్తిచేయుటకై చెల్లింపడిన కిస్తుమొత్తములపై బ్యాంకువారు నూటికి 2 1/2 వంతున వడ్డియిచ్చెదరు.

(5) పూర్తిమొత్తముచెల్లించిన తరువాత బాండ్లుయివ్వబడును.

(6) బాండుమొత్తముపూర్తిగా చెల్లించినతరువాత ప్రతిశతి 2 1/2 వడ్డీలాగిపోయి, బాండు యివ్వబడినతేదినుండి సరియైనవడ్డి చెల్లింపబడును

(7) బాండుయొక్క పూర్తిమొత్తమును చెల్లించకముందే అమ్మదలచినయెడల బ్యాంకువారు దానిని మార్కెటురేటుప్రకారము ఏమియుకమీషన్ లేకుండ కొనియిచ్చి దానిపైయింకా చెల్లించవలసినసైకమును పట్టుకొని మిగత సైకమునిత్తురు.

హైదరాబాదు-దక్కన్ } మేనేజరు.

28—8—40 } కె. జె. వికాజీ

---

# హిస్టీరియాకు అమోఘమైనమందు

## =3 రోజుల్లలో కొంచెముగుణంచూపును=

మీరుయిచ్చినమందు వారుమాత్రమువాడితిని. ఆశ్చర్యకరంగా గుణమిచ్చినది యింతకంటె నమ్మకమైనమందు యింకొకటిలేదని గ్యారంటీగాచెప్పగలను. నేటివరకు సొమ్మగాని, తదితర పిశాచలక్షణములు గాని. మరల కనుపడలేదు. ఇట్లు, రామచంద్రయ్య మునిషీ జట్ప్రోలుసంస్థానం, సంకీర్తనలాన్, హైద్రాబాద్-ఈవ్యాధి సమవయస్కులుగాని దంపతులు (అనగా రెండవ మూడవ)వివాహముచేసుకున్నవారి భార్యలకును, బహిష్టుసరిగా జారీగాకుండెడి స్త్రీలకున్ను భర్తనుజూచిన -భయముగలిగెడి స్త్రీలకున్ను, భర్తచే ప్రేమింపబడని స్త్రీలకున్ను, భర్త దేశాంతరగుండున్న స్త్రీలకున్ను, కొంచెముగు గర్భిణులకున్ను, తరుచుగా నీవ్యాధి సంభవించుచుండును. ఈహిస్టీరియావ్యాధిచర్యలు బహుఅద్భుతములు, పిశాచము బ్రహ్మరాక్షసున్ను, కామినీ ఆవేశించినవారి చర్యలకున్ను, పిటికిని యిసుమంతయు భేదము గాన్పింపక, కేవలము పిశాచచేష్టలవిన్ని, మంత్రప్రయోగములవిన్ని భయిందమవల్లు గాకేని యకార్యమైన శరీరరోగము మార్పు. కొకచెమ్ము, స్మారకము [గోలివి]తప్పి పడిపోవుట, నోటినుండి నురుగులు, శ్లేష్మంపడుట, కాళ్లుచేతులు కొట్టుకొనుట, గుడ్లుతిప్పుట, కండ్లుమూయుట శ్వాస, అయాసము, గుండె దడదడకొట్టుకొనుట, పండ్లుకొరుకుట. అతివాగుడు, చిత్రచిత్రపుమాటలు, వెక్కివెక్కి యేడ్చుట, దగ్గరనున్నవారిని తిట్టుట, అంతలో వెర్రినవ్వు నవ్వుట, జుట్టు విరబోసికొనుట, సిగ్గులేక ప్రలాపించుట కాళ్లు చేతులు, పిడికిళ్లు, బిగుసుకొనిపోవుట, పెదవులు, శరీరమంతయు వణకుట, చచ్చెదనని లేచిలేచి నూతికి, గోతికి పరుగిడుట, పండుకొన్నతల్పము గజగజవూపి తిలుపులుపగులునట్లుతన్ని, తపకంటె, బలవంతులుయెంతమంది పట్టుకొన్నను వదల్చుకొని పెట్టెలు పగులకొట్టి అందున్నవస్తువులను పాడుచేసి పార్వతి మను, ఇంతలో తెలివివచ్చు నుయుసుగును గను క యింకను నేను యీరోజుకు దీని వదలి పెట్టి పోవుచున్నాను మీరందరు సుఖముగా నుండుడు. కొంతమందికి యీ వ్యాధిలోనే గర్భనికలుగుటయు యీ బాధలన్నియు ప్రసవానంతరము వరకుండుటయు గలదు. కాని యిట్టి గర్భవతులకు గలిగెడి సంతానము పిచ్చి, మూగ, (నత్తి) మాటలురాకుండుట ఒకరముగలిగి మందమతులగుటయు గలదు గొప్పగొప్ప డాక్టర్లచేతను మందులిప్పించియు, యింజక్షనులిప్పించియు. మంత్రవేత్తలచే రక్షరేకులు కట్టించియు, జపహోమాదుల గావించియు వందలకొలది ధనవ్యయమొనర్చి ఫలితమొందనివారికి మావద్దను అమోఘముగా 3 దినములలో గుణముచూపగలదని నుడివేయుచున్నాము 1 వారపు మందు రు 30 లు వి పి ఖర్చు 0-12-0

డాక్టర్ రత్నంఅండ్‌సన్సు మెడికల్‌హాల్ 252 బి మలకపేట, హైద్రాబాదు (దక్కన్),

(బ్రాంచి:- మనోహర్ సినిమాఎదుట-సికింద్రాబాదు.